# 2

దలఁ దలమోపి భ్రష్టుఁడని దా
రొ్కని నన్నిఁకఁ దిట్టఁబోకుఁడి
యలఘుచరిత్రులార కరుణాన్విత
భూషితులార యిమ్మెయిన్. 1

గీ. జోలిలోపల కొరకంచుఁబోలెఁబణ్య
కులజులనెఱుంగకుండఁగ క్రూరమతులు
గోరివిత్తంబుఁగోల్పోయి కుందుచుంద్రు
నీచదశయందుఁ గృశియించి నీల్గుచుంద్రు. 2

---

# 3

ఉ. వారవిలాసినీ మమతవర్తనమున్
వినయోక్తులెంతయున్
నేరకమత్తులై విటులు నీరజ
నేత్రలఁబాసి వేశ్యలం
గోరిసమస్త సంపదలఁ గోల్పడి
దార్ఢ్యతఁదప్పియొందటీ
ధారుణియందు న్యూనతను
దాలిచి భోగులు జోగులైరొకో.

గీ. ధనముఁ గలవాని వయసునఁదనరువాని
కులుకుగలవాని బల్ హొయల్ గలుగువాని
సుతకు చేకూర్చియటుమీద సోకడంచి
వెడల నడపించు యమదూత వేశ్యమాత. 4

సీ. విటకాండ్రవలపించి చిటికలోమఱపించి
కుఁచించి కొంపలమ్మించి మించి
ప్రేముడిదేలించి భూములబోకార్చి
సర్వంబుగ్రహియించి చలము పెంచి

---

5

యనురాగమునముంచి ధనముఁబ్రియమునూడ్చి
సాగఁదోలించి ప్రశాంతిగాంచి
నిందలదూలించి మందులపోలించి
తుదకు బిచ్చపుచిప్ప కదియనిచ్చి

గీ. కళత్ర పాజ్ఞేయుకుటిలలుగఁజ కలారు
రనియొఱంగియు వారలననుసరించి
మానమభిమాన మిసుమంతయైన లేక
మోసపోవుచునుందురు మూర్ఖమతులు. 5

6

గీ. విటుల నేర్పు నలాలించి విత్తమెల్ల
నూడ్చి పరదేశవాసిగా నొనరఁజేసి
మరల నొకనినిఁదరిఁజేరి సరసగతుల
దనుపుచుందురు ప్రేమిడి గణికలరయ. 6

సీ. కలిమికాసించిగ్గు వలపు హెచ్చించియు
ప్రేమ్మిడి ధనమునార్జించుమిగుల
రావించియింటికి భావించి రెంటికి
చెడఁగొట్టి ధనమునార్జించుమిగుల

---

7

మాయల మసిబూసి హేయంబునకు రోసి
చెలువొంద ధనమునార్జించుమిగుల
ద్వేషించియంతనే భాషించి వెంటనే
మంచిగాధనము నార్జించు మిగుల

గీ. అహా ! వెలయాండ్ర కెంతటి సాహసంబొ
చెలఁగి నెత్తుడు పీల్చెడి జలగలార
భోగినైనను క్షణములో జోగిఁజేసి
వెడలనడపింతు రిటులను వేశ్యలకట. 7

8

చ. అటునిటుసంచరించి విటులందఱం
జేరఁగఁదీసి ప్రేముడిన్
బహుతరక్రీడలన్దనిపి స్వాంతమురంజి
లఁ జేసి ద్రవ్యమున్
గుటిలపు వేశ్య యూడ్చి తలకుం
దగినట్టి కుళాయిదీర్చి వే
సటఁగలిగించి యయ్యకును క్రన్నన
సాగఁగఁదోలు క్రూరతన్. 8

9

చ. ధనమునసించు దేహమున దా
ర్ఢ్యతతగ్గును బంధుకోటియుం
గనినహసింత్రు దుష్టునిగఁగాంతురు
లోకులు స్నేహపాళియుం
గనుఁగొనరాదు ! పణ్య కులకాంతల
కూటమి నిన్ని కష్టముల్
దనరును రోగపీడనము దార్కొను
కాంతిహరించు నంతకున్. 9

10

గీ. ఇట్టికష్టంబులకు దగహేతువైన
వెలవెలందులకూటమి విడచి మిగుల
భాగ్యభోగ్యంబులంగని ప్రథితకీర్తి
గాంచి వర్ధిల్లుడీ(కమీ(ద నంచితముగ. 10

ఆ. వె. ఇంతదనుక వేశ్యలెన్ని మాయలఁబన్ని
పదులు వందలనక గదసి విటుల
పొందుఁగూడి విత్తమునునూడ్చి కులవృత్తి
విడువకుండ వేడ్క నడపుచుండ్రి. 11

11

శా. ఈకాలంబున వారకాంతలకు
దిక్కే లేదు సంసారులే
వీకంజూచిన నిండిరెల్లెడల నీ
వేశ్యాంగనా గర్వముం
బోకల్ సాగవు పాటకా
సాగనుకా ముచ్చట్లకా కుచ్చులం
గాకా పావడకా విలాసమునకా
కాంతల్సరిం బోలఁగన్. 12

గీ. ఔం వెలయాంధ్ర సిరిజూచి యబ్జభవుఁడు
గాసిపెట్టఁగ మదినూహచేసిచేసి
మించివ్యభిచారికల సృజియించిమిగుల
వారకాంతల వంతలపాలుపఱచె. 13

క. ఇలువెడలి వెలికివచ్చిన
కులకాంతలుఁ గూటికి మఱి గుడ్డకుఁగరవై
మలమలమాడుచు వ్యాధుల
నెలవులగుచు క్షీణదశను నిల్తురుసతమున్. 14

క. పతినెడబాసిచరింపక
పతికనుకూలంపుగతిని వరలుచుసతమున్
పతిపాదపూజ సల్పెడి
సతులకుఘనయశము మోక్షసాధనమరయన్. 15

సీ. పతిభక్తిపరలౌచు క్షితికులాంగనలెల్లఁ
జిరకీర్తిఁ వహియించి వరలుగాత
చంచలస్వాంతలై చనకసతీధర్మ
వర్తనులై గడుప్రబలుగాత

మఱదుల నత్తమామల కడ నణఁకువ
గాఁజరింపుచుఁ గూర్మిఁగాంత్రుతు గాత
పెరవారిఁ దనవారి నరయుచునొకరీతి
భాగ్యభోగ్యంబులఁ బడయుగాత
గీ. పతులు సతులును నేతరిఁ బాయకవని
ధర్మమార్గాన నెరణాము దప్పకుండ
బుధులసన్మానమును గాంచి పొలుపుమీఱఁ
బుత్రపౌత్రాభి వృద్ధినిఁ బొదలుగాత. 16

ఖింతప [illegible] ము.